# అష్టాలయ కుసుమం

డా. చింతలపాటి మురళీకృష్ణ

తే.గీ. శ్రీనివాసుడు కలియుగ మానవులను
బ్రోచి రక్షించ గలవాడు బుద్ధిమంతు
లా మహాత్ముని దీవెన లందుకొనగ
భక్తి తలదాల్చు డిమ్ముగా శక్తి కొలది 1

తే.గీ. దేవదేవుని పూజించి దివ్యమైన
రక్షనొందిన దుర్మార్గ శిక్ష కలిగి
లోకశాంతి రహించి కల్లోల విషయ
మణగిపోవును ప్రజకు మే లధిక మగును 2

తే.గీ. దైవసేవ యొనర్పగా తరలివచ్చు
నెల్ల సంపదలని జను లిచ్ఛ జేసి
కొలువబూనుట మేలుగా దిలను కష్ట
మొలయు వేళల రక్షింప దలప వలయు ! 3

తే.గీ. కష్ట సుఖములు జంటగా కదలివచ్చి
యిష్టములవెంట నష్టాల నెలమి గూర్చి
యాటలాడును విధి పరిహాస మొలుక
జీవకోటిని తలక్రిందు జేసివైచి ! 4

తే.గీ. సంతసించెడి యంతలో వంతగూర్చి
యావిరిని జేయు నా సుఖ మంతరింప
యెప్పుడేరీతి దగులునో యెదురుదెబ్బ
లాది దేవునికే యెరు కగును గదర ! 5

తే.గీ. జన్మజన్మల పరిణామ సంవిధాన
మేమి చెప్పుచునున్నదో యెరుగ గలవె
ఆశ లన్నవి జన్మాంతమైన వెనుక
వెంట వచ్చునె ? వీటికై విరహమేల ? 6

తే.గీ. ఆశ చావదు యెన్నేళ్ళయాయువైన
గడచుచుండిన మరిమరి కలుగుచుండు
కోర్కెలన్నవి వృద్ధియై కుదుపుచున్న
వాటిచుట్టునె బ్రతుకులు వనరుచుండు ! 7

తే.గీ. నిగ్రహమ్మును పూనెడి నేర్పుగలిగి
తొణక కుండగ నిల్చెడి త్రోవ నెరిగి
ఎందరీనాడు లోకాన నెదిగినారు ?
నిబ్బరమ్ముగ నెందరు నిలువగలరు ? 8

తే.గీ. చేయుచున్నట్టి కర్మవిశుద్ధి నెరుగ
లేక కాలంపు చేష్టగా లెక్కవేసి
భ్రమల జీవించు మానవ క్రమముజూడ
వింతయౌగాదె దీనికై చింత యేల ? 9

తే.గీ. నీతి పాటింపుమని జెప్ప నిందయౌను
బూతు నేర్పించ బూనినన్ పుణ్యమౌను
ఎవరి వాంఛల రీతుల నెరిగి కొనుచు
వారి ఇష్టాలదీర్చిన వరలు సుఖము !! 10

తే.గీ. బ్రతికినప్పుడు ముందరి గతి నెరుంగ
బోరు జీవులు యిష్టానుసారమేగి
నరకయాతన నలుగుచు నురియునపుడు
వచ్చి కాపాడు దేవుడు వఱలబోడు ! 11

తే.గీ. లోకమంతట చీకటి యేకమయ్యె
పగలు రవిదోచి వెలుగుల ప్రగతి నింప
నవ్వుచుంటిమి మరణాంతమెవ్విధమున
వెలుగు జూతుము పాపాల కలుగులోన !! 12

తే.గీ. చేయుచున్నట్టి పాపాల చింతలేక
యెవడు జూచెడు నివి యని హెచ్చుబోయి
కర్మసంకెళ్ళ బిగియుచు మర్మ మెరుగ
లేకనశియించు జీవుల సోకు జూడు !! 13

తే.గీ. పాపినైనను పుణ్యానువర్తనుడని
మెచ్చుకొందురు లోకులు మెప్పుకొరకు
ఇట్టిరీతిని పాపు లింకెందు నుండు ?
లోకమంతయుపుణ్యాత్ములే కనంగ 14

తే.గీ. రాక్షసుండైన దేవుడేరా యటంచు
పొగడుచుందురు అధికార మెగువనుండ
మంచివానిని దుష్టుడౌ మనుజుడనుచు
తరిమికొట్టును పోగాలమురిమినపుడు ! 15

తే.గీ. క్రూరజంతువు లుండెడి ఘోర విపిన
మందు సాధువు లాహార మగుచునుండు !
ఇచట నన్యాయమనరాదు యిదియె ధర్మ
మగును; కాదను వాడిట మనగలేడు !! 16

తే.గీ. మెరియునదియంత బంగారమేమి కాదు
చెప్పలేకున్న సత్యమ్ము చెరిగిపోదు
పుట్టు కులమును బట్టి యేపుష్టి రాదు
ఇచ్చకాలొప్పజెప్పినహితుడుకాదు 17

తే.గీ. కలిమియే బలమౌనని తలచుకొనుట
సర్వజనులకు పరిపాటి యుర్విలోన
కలిమిలేనట్టి జనులు లోకాన లేరె
కలిమి లేకున్న బ్రతుకులు కాలునొక్కొ ? 18

తే.గీ. ఎంత ధనమున్న ధరణిలో నంతగొప్ప
యనెడి మాటలు కల్లలు! యట్టులైన
రాజులందరు ఋషుల సామ్రాజ్యమందు
వంగియుండి రదేల విభ్రాంతి గొలుప 19

తే.గీ. కోట్లు గడియించి యనుభవకూర్మి లేక
మృతిని జెందిరి యెందరో గతులు తప్పి
అనుభవించెడి గీత యావంత లేక
పోవువారికి ఈ కోట్లు పూజ్యమౌనె ? 20

తే.గీ. ఉన్నతంబైన విద్యను గన్నవారు
గర్వమొందుటయేగాని గణన కెక్కు
నట్టి విజ్ఞాన మిసుమంత యరసినారె
సత్యదూరంబునైన పాండిత్యమేల ? 21

తే.గీ. పొట్టకూటికి చదివిన లొట్టి విద్య
లివ్వి విజ్ఞానమును గలిపింపలేవు
శాస్త్రవిద్యలు లోకాన సన్నగిలెను
ఇంక సుజ్ఞానమెట్లు వరింపగలరు ? 22

తే.గీ. పుటకతోడనె పొందిన పుణ్యమున్న
కొంత గ్రహియింపు లభియించు కూర్మి గలుగు
నట్టివారలు యెట్టులో జ్ఞానమరసి
తుట్టతుద కెట్టులైనను తుదిని జేరు 23

తే.గీ. తెలిసి తెలియని మూర్ఖుల తెలివి వలన
దారి తప్పుచున్నారు ధర్మరతులు
వారి నరయుచు సరిదిద్దు వాఙ్మి భవులు
కానరాకుండె నేడు జగమ్ము నందు 24

తే.గీ. మతపిపాస యొకందు దుర్మార్గమగుచు
దేశవాసుల భ్రమపెట్టి నాశనమ్ము
జేయుచున్నది మౌఢ్యమ్ము డాయజేసి
కోలుకోలేని దెబ్బను కొట్టుచుండె 25

తే.గీ. జీవులందరి యందున్న దేవునరయ
లేక వేరొండు రూపాన ప్రాకటముగ
మించి యుండెనటంచు శోధించువిధము
కాలహరణమ్ముగాకిదిమేలుయగునె? 26

తే.గీ. ప్రాణరూపమ్ము కనుగొని భక్తి మీర
దానినర్చించు టదిమేలు! గాని యిట్టి
యూహనైన నెరుంగరు యుర్విలోన
మతము పేరున యుద్ధాలు సతమొనర్చు 27

తే.గీ. దైవశోధనపేరున జీవశక్తి
నంత జీర్ణమ్ముసేయుచు పంతగించి
తానునమ్మిన దైవమే దైవమనెడి
మూర్ఖవాదాన లబ్ధి యేమున్నదయ్య ! 28

తే.గీ. సర్వశాస్త్రాలు అనుభవసార మనుచు
ఆత్మవిజ్ఞాన సుజ్ఞాన మందజేయ
నందుకొనలేక మరిమరి యాసపడుచు
దివ్వె చుట్టెడి శలభమై దేహు లలయు 29

తే.గీ. చర్మ చక్షువులేసరి? మర్మమరయు
నంతయే చూచి యదియ విజ్ఞానమనుచు
నాత్మదర్శన భాగ్యమ్ము నందలేక
స్రుక్కుచుందురు జీవులు మిక్కుటముగ 30

తే.గీ. బుద్ధి యొక్కటియే జీవశుద్ధి యగును
నదియు జన్మాంతరాల సంపదయు నగును
అట్టి బుద్ధిని గడియింప నలసులగుచు
వాదమెంత యొనర్చిన ఫలమదేమి ? 31

తే.గీ. ముందు జన్మల గడియించు పుణ్య ఫలము
వలన సద్బుద్ధి లభియించి వరలుచుండు
నపుడు యేకాగ్ర చిత్తమ్మునందు శివుని
నిలిపి ధ్యానించ పరమాత్మకలిమిగలు 32

తే.గీ. ఇన్ని మెట్లెక్కి ముకుసూటి యేర్పడుటకు
జన్మజన్మల సుకృతమ్ము చాల వలయు
నట్టి పుణ్యమ్ము లేనిదే యణువు యైన
కదలబోదట తలపులు కలగవంట 33

తే.గీ. పుట్టువన్నది జన్మలపుణ్యఫలము
బుద్ధిమత్తయు దానిచే పొడముచుండు
నిది యదృష్టమ్ముగా జనహృదయమందు
పొగడబడుచుండు సత్ఫలపూర్ణమగుచు ! 34

తే.గీ. వయసుకనురూపమౌ కోర్కె వాంఛితమ్ము!!
కాని హద్దులు దాటక గాంచవలయు
హద్దుపద్దులు గల్గిన యాశయములు
తప్పుకాబోవు మానవ ధర్మమగుట ! 35

తే.గీ. ధన సుఖమ్ములు పొందగా దగునటంచు
వారవృత్తికి దోగుట భావ్యమగునె!
ధర్మచింతన లేని అధర్మగతుల
నరయబోవుట పాపమ్ము ధరణియందు 36

తే.గీ. నిన్నమొన్నటి ధర్మాలు నీతిదప్పి
ఆటవిక వృత్తి చెలరేగి యన్నిచోట్ల
విచ్చలవిడి తనంబది పెచ్చుమీరి
పాపభయమనునది లేక బరితెగించె 37

తే.గీ. ఎవరి యిష్టము వారిదై యెంతకైన
వ్యభిచరించుట తప్పుగా తోచదయ్యె
నీతినియమాల కట్టడి నిలువలేక
యిచ్చవచ్చినరీతి చరింపదగునె? 38

తే.గీ. సంఘనియమాలు గంగలో సంగమించె
పాపపుణ్యాల సంగతుల్ పారిపోయె
భువియె దివియన్న భావన బుద్ధికెక్కె
నిహసుఖమ్ములు చాలన్న నిచ్ఛగలిగె 39

తే.గీ. చచ్చిపోయిన తదుపరి సంగతులను
తలచుకొననేల? దిగులుతో కలవరమును
భయము నొందగ తగదంచు బ్రతుకునందు
సుఖమునొంద దలంతురు సొగసుగాండ్రు ! 40

తే.గీ. స్వర్గచింతన మెదడుకు సౌఖ్యమిచ్చు
నరక భావన యన్నదే పిరికితనము
గాన దానిని తలపక గగనమంటు
వాంఛితార్థము లాశింత్రు వైభవముగ 41

తే.గీ. యోగియైన సకలపరిత్యాగి యైన
కూడినంతటి సుఖమును కోరుకొనును
కష్ట జీవన మెవ్వరు నిష్టపడరు
అందరును సౌఖ్య భోగాలనొందగోరు 42

తే.గీ. దైవచింతన కాలానుధర్మమగును
నిజముగా దేవుడెవరికి ఋజువుగాడు
కనుక పేరుకు పైపైన వినుతిజేయు
ఖర్మ కాలిన యార్తితో మర్మమరయు 43

తే.గీ. దైవభీతియు నెవరికిన్ ధరణి లేదు
గాని సౌఖ్యమ్ము దొలగించ గలడటంచు
భీతియొక్కటి జనులలో పేరుకొనియె
నదియు లేకున్నచెలరేగి యాడుకొనరె 44

తే.గీ. పాపజనులను పేరెత్తి పలుకరింప
పామువలె బుస్సుమనుచు దిగ్భ్రాంతి గలుగ
జేయగలవారు సతము జేజేలు పలుక
సంతసమ్మున సన్మాన మింత నొసగు 45

తే.గీ. తెలుగుభాషను బోధించు దేశికులును
శబ్ద సౌష్ఠవ మెరిగి భాషను గురించి
దీక్షతోడను బోధింప తెలుగువారు
వన్నె తరుగక విశ్వవిఖ్యాతి నొందు 46

తే.గీ. జాతి సంస్కృతి నిలుపగా సర్వజనులు
దీక్షబూనగవలయు! నిదే విధమున
ప్రభుత బాధ్యత వహియించి పలు విధాల
మార్గదర్శనమొనరించి మనుపవలయు 47

తే.గీ. తెలుగు మాటాడ గౌరవదృష్టిలేదు
ఆంగ్లమే గొప్పయను భావ మధికమయ్యె
తెలుగువాండ్రకు మరియొక దిక్కటంచు
ఆంగ్లమును నెత్తికెత్తుకు నరచు చుండ్రు !! 48

తే.గీ. ఇతరదేశాల తెలుగువా రింతకన్న
చక్కనైనట్టి తీరున సాగుచుండె
తెలుగు పద్యాలు వ్రాయుచు తేటతెలుగు
పిల్లలకునేర్పు చున్నారు ప్రియముతోడ 49

తే.గీ. వెసులుబాటున్నయంతలో వివిధ గతుల
తెలుగు సాహిత్యసభల నుద్దీప్తి తోడ
జరుపుకొనుచుండి రెల్లెడ సరసమైన
భాష వర్ధిల్లు నట్లు ప్రభావితముగ ! 50

తే.గీ. చిన్నతనముననేర్చిన వన్నె లరసి
తమకు చేతైనరీతి పద్యాలనల్లి
తెలుగుతనమును విడువక నిలుపుకొనుచు
"**తెలుగు మల్లి**"యలై తావి నలదుచుండె 51

తే.గీ. తెలుగు దేశాన తెలుగు విలాసముడిగి
భిన్నభాషలసంక్రమచ్ఛిన్న మగుచు
చిన్నబోవుచు నుండగా చెన్ను మీరి
ఇచట నస్త్రాలయా యందు ప్రచలితమయె 52

తే.గీ. పద్యకవితలు కావ్యాలు బహువిధాల
నాటకమ్ములు, కథలు గుణప్రధాన
సాహితీ రూపకమ్ములు చర్చ లెసగు
నట్టి యవధాన సభల యస్త్రాలయమ్ము 53

తే.గీ. పాఠశాలల తెలుగొక పాఠ్యమయ్యె
పాలనావిధమందున పాత్రనొందె
నైచ్ఛికాంశమ్ముగా తెలు గాదరమ్ము
నొందె నీదేశమున తెలుగొ కండ యనగ 54

తే.గీ. తెలుగువారికి వందనములు ఘటించి
గౌరవింతురు యిచ్చట గల సుజనులు !
కట్టు బొట్టును గనినంత కరము మోడ్చి
రెండు చేతుల వందనాలిత్తురిచట 55

తే.గీ. తెలుగు బోధకులే లేని దేశమందు
తెలుగు పద్యాలు రూపొందు తీరు జూడ
తెలుగుతల్లికి సంతోషదీప్తి కలుగు
"**తెలుగు మల్లి**"కి పరిమళ మొలయుచుండు 56

తే.గీ. ఇంజనీరుల పద్యవాహిని రచింప
వాటుసాపున పద్య సంభాషణమ్ము
సలుపుచుండుట భాగ్యమై సంఘటిల్లె
తెలుగుతల్లికి పర్వమౌ వెలుగునొసగె 57

తే.గీ. తెలుగువారలు వారాంత శలవులందు
కలసి తెలుగున సాహితీ కొలువు జేసి
తృప్తినొందెదరందరు దేశమాత
పలుకు పంచుచు సంతోష భరితులగుచు 58

తే.గీ. ఇచటివారలు మర్యాద నెరుగువారు
ఒకరివిషయాలలో మరి యొకరు జోక్య
మింత చేకొనబోరు కవ్వింత లేక
యెవరిదారినవారుందు రెంతవరకు ! 59

తే.గీ. పరిసరమ్ములు శుభ్రమై భాగ్యమిదును ;
నీరు, విద్యుత్తు కోతలకరువు లేదు ;
సౌరవిద్యుత్తు ప్రతియింట పరిఢవిల్లి
పుష్కలమ్ముగ సరఫరా పొందజేయు ! 60

తే.గీ. వీధులందున చిరుచెత్త వేయరిచట
మురికి కంపును ముసిరెడి పురుగులున్ను
నీగదోమలు బొద్దింక లిచట జేర
లేవు శుభ్రతయే భాగ్యలీల యగును 61

తే.గీ. ఆకుపచ్చని గడ్డి వృక్షాదులిచట
శుభ్ర వాతావృతమ్ము సంశోభలెసగ
జేయుచుండును వీధులు చెన్నుమీర
నిర్మలమ్ముగ నలరారు నిరుపమగతి 62

తే.గీ. అన్ని పనులను యంత్ర సహాయముననె
నిర్వహింతురు జనసంఖ్య నిమ్న మగుట
దేశ సంపద వర్ధిల్లె కోశవృద్ధి
యున్నతంబయ్యె కఋవను యూసులేక ! 63

తే.గీ. తల్లిదండ్రులు వానప్రస్థమ్ము బోదు
మందురయ్యెడ నస్త్రాలయమ్ము దగును
శుద్ధ వాతావరణ భాగ్య శోభతోడ
నన్ని సౌకర్యముల జాడ నందగలరు 64

తే.గీ. క్షుద్రబుద్ధులు లేని సముద్ర తీర
విహరణమ్మది ప్రకృతి వీక్షణమ్ము
మనసు నాహ్లాదపరచెడి మంచి తావు
దుర్లభంబిది; యంతట దొరకబోదు ! 65

తే.గీ. ఆలు మగలగురించిన యదుపులేదు!
కానీ ఇష్టతలేకున్న కవయబోరు
స్వేచ్ఛగా నడవందగు సిరులభూమి
మంచిగా జనులను గౌరవించు భూమి ! 66

తే.గీ. ఖండఖండాలప్రజలు సుఖమ్మునొంద
శుభ్ర వాతావరణ పరి శుద్ధి మెచ్చి
వచ్చి యస్త్రాలయమ్మున వసతినొంది
అనుభవింతురు ప్రకృతి సుఖానుభూతి 67

తే.గీ. చాలకాలము శీతోష్ణ సంగతులవి
సమముగానుండు; వేడియున్ సహితమగుచు
మితముగానుండు ;చలికొంచెమెక్కువగును
నైన నాహ్లాదకరమౌను జనులకిచట ! 68

తే.గీ. ఎగసిపడు ఫేన పుంజమ్ము యినుమడించి
స్నేహబంధమ్ము కలదంచు చేయిచాచి
నర్తకినివోలె కవ్వించి నాట్యమాడు
గోల్డుకోస్టున బర్లిసర్ఫ్ కొలువునందు 69

తే.గీ. గోల్డుకోస్టది మహలక్ష్మి కొలువనంగ
వైభవమ్ముగ తోచును ప్రకృతి సరళి
చూడచక్కని దృశ్యాల సొబగులిచట
తనివితీరని సుఖముల దానమిచ్చు 70

తే.గీ. షార్కు వేలులు గెంతుచు స్వాగతించి
మేలమాడును జనులతో మెచ్చినట్లు
ఎన్నిగంటలు తరగల నెగురుచున్న
తనివితీరదు సర్ఫర్ల పెనుగులాట ! 71

తే.గీ. తీరహారాన నీదుచు తరిమివైచు
నలల తలక్రిందునౌచు  మీనులకు వలెను
సంబరమ్మున గెంతెడి సాహసులను
గాంచినంతనె పులకించు గాత్రములవి !! 72

తే.గీ. నన్ను చూడుడు నానావ నడకచూడు
డన్న చందాన జెట్ స్కీ విహారములును
సాగరోపరి తలమున సాగుచుండ
కలతలన్నియు పరుగున తొలగి చనును 73

తే.గీ. తీరమందున కూర్చుండి దృష్టి నిలిపి
సాగరమ్మున సాగు నౌకాగమనము
నిర్గమమ్మును వీక్షింప నిరుపమాన
తత్వచింతన మనసులో తాండవించు 74

తే.గీ. నౌకలో సర్వ సౌఖ్యాల నయము జూడ
నింద్ర భవనమ్ము తీరుగా నెలరుచుండు
దూర తీరాల నౌకా విహారమందు
అన్ని లోకాలు దర్శించు హాయి కలుగు ! 75

తే.గీ. నౌకలో గీతవాద్యాల నాట్యమరసి
ఇంద్రలోకమ్ముగా నెంచి యెవ్వరైన
భ్రమసి మధిరను గ్రోలుచు భ్రమరమట్లు
తూలి నర్తకిపై వ్రాలి సోలిపోవు 76

తే.గీ. ఓడరేవుల సంబరమ్మున్ గ్రహింప
వచ్చిపోయెడి నౌకలు వరుసదీరి
దిగుమతులుకొన్ని యెగుమతుల్ దిద్దుకొనుచు
నట్టహాసమ్ము సల్పుట యద్భుతమ్ము 77

తే.గీ. కోల్సు షాపింగు మాల్సు టార్గెట్టు హార్వె
నార్మనైకియ జేబిహై నవ యొపేర
బోండి జాక్సను రాయల బోట్నితోట
లేకు టిర్రెలు టర్పిన్సు లెక్కగనుడు ! 78

తే.గీ. పదియు రెండపోజిల్సును బడ్జి బిమ్ము
ఫాన్సు యర్రా ఫిలిపు కిల్ల పరచిచూడు
గ్రేటు యోషను ఫ్లిండర్సు కూడ జూచి
త్రోబు వీధిని జనుము పాత్రోచితముగ 79

తే.గీ. మెల్లు బోరను సిడ్నీల మేలుగనుచు
బ్రిజ్జు బేనుకు రండు కేంబ్రిడ్జి బోలు
యూనివర్శిటి లియ్యెడ నుండెజూడు
బోధనముజేయు యంత్రాలు బోలెడుండె 80

తే.గీ. ఎవ్వరైనను కార్లలో నేగుచుంద్రు
నడచివెళ్ళెడివారలీ నాటలేరు
ఊరు దాటగ ప్లైటులే యుపకరించు
రైళ్ళు కొన్నియు గలవు సరాగములకు 81

తే.గీ. కారు నడిపెడి వారలు హారనులను
మ్రోగజేయగరాదు నామోదమొంది
యొక్కవరుసన బోవలె తిక్కపుట్టి
దాటిపోవగరాదు సంధాన మురియ 82

తే.గీ. వేగనిర్దేశ్యమునుబట్టి వెడలవలెను–
హెచ్చుకుందులు పోరాదు యెవ్వరైన
నైదుమందియె కారులో నరుగవలయు
మించికూర్చున్న నపరాధ ముంచబడును 83

తే.గీ. అన్నిఇండ్లకుసోలారుయమరియుండు
కాన విద్యుత్తు కొరతను గానలేము
త్రాగునీరన్నివేళల తప్పకుండ
వచ్చుచుండును కఱువను వరస లేదు 84

తే.గీ. గంగ గోదావరీకృష్ణ సంగతులిట
లేకపోయిన నీటికి లేమి లేదు
పాలలో నీరు కలిపేటి కలుషబుద్ధి
వీరికిన్ లేదు నీతియే వీరి హితము 85

తే.గీ. ఇచటి వారలు ధర్మాత్ములేమొగాని
ఇచటి మట్టికి యంతోటి హెచ్చులేదు
భారతోర్విని గల నేలసారమిచట
లేనెలేదయ్య పండింపలేరు పంట 86

తే.గీ. భరతదేశాన విస్తార సారముండె
పాడిపంటల కదియె సుభద్రమగును
ధర్మమీనాడు కుందుచు తప్పిజనుట
భరతదేశమ్ములోను సంప్రాప్తమయ్యె 87

తే.గీ. విశ్వమందున భారతి వేదభూమి
పాపపుణ్యాలనెరిగిన భవ్యభూమి
కర్మసిద్ధాంతమిచ్చిన ధర్మభూమి
ధర్మదృష్టి రహించు సుకర్మభూమి ! 88

తే.గీ. జగతికే నడకలు నేర్పు సత్యభూమి
విశ్వమును చదివించిన విద్యగామి
బ్రహ్మసృష్టిని వివరించు భరతభూమి
శాస్త్రపాండిత్యమును నేర్పు శౌర్యభూమి 89

తే.గీ. భరతభూమినిపోలిన భాగ్యభూమి
విశ్వమందున లేదు భవిష్యమందు
నుండబోవదుకాని యనూహ్యమైన
ధర్మవిచ్ఛిత్తి గూల్చెనీ ధరణి విలువ 90

తే.గీ. తోటి అస్త్రాలయమ్మును దాటలేక
చచ్చుపడియుండెనీనేల జవములేక
భరతపుత్రుడు పౌరుష వంతుడైన
భారతీగౌరవమునిల్పి వరల గలడు !! 91

తే.గీ. నీతిమాలినజనులు నిర్భీతితోడ
దేశగౌరవఘాతలై ద్రిమ్మరుచును
జాతిగౌరవమన్న విశ్వాసముడిగి
సర్వభ్రష్టతనొంది నిశ్వసిలుచుండె 92

తే.గీ. సొమ్ములాశించి యోట్లమ్మి సొమ్మసిల్లి
దిక్కుగానక డొక్కలు నొక్కుకొనుచు
ధూర్తజనులకు పాలింప తొడవులిచ్చి
యూపిరాడక నుండిరి పాపజనులు! 93

తే.గీ. రాజ్యకాంక్షను జనుల విభాజ్యపరచి
కులగుణమ్మును రెట్టించి కూట నీతి
నమలు జేయగ ప్రజలును యభిచరించి
నెత్తికెత్తిరి దుష్ట దుర్నీతి పరుల 94

తే.గీ. తనకు నధికారమందిన తప్పకుండ
ప్రజలధనమును భక్షించి రాజుయగుట
నొకదురాచారమయ్యె నిందొకడుకూడ
వేరుకాకున్న దేశమ్ము వృద్ధి యగునె 95

తే.గీ. భారతీయుల దుర్నీతి వర్తనమ్ము
పాలనమ్మున ఫలియించి విలయమొసగె
నట్లు గాకున్న అస్త్రాలయమ్ము వలెనె
భరతభూమియు వృద్ధియై పరిఢవిల్లు 96

తే.గీ. అధిక సంతానమున్నచో నాధిపత్య
మమరునంచు జనాభాను నతిశయింప
జేయు మూఢులవలన నిస్తేజమయ్యె
దేశభాగ్యమ్ము మూర్ఖుల తిక్కవలన 97

తే.గీ. ఇపుడు భారతి భాగ్యమ్ము నినుమడింప
జేయునుపదేశమదియేమి ? చిత్తశుద్ధి
దేశభక్తియు నిస్వార్థ దీక్ష భ్రాతృ
భావనమ్మను జాతి గాపాడగలవు !! 98

తే.గీ. ఐకమత్యము కులమత హనన బుద్ధి
నీతి చిత్తము జాత్యైక హితము గోరు
చేతనత్వము దుర్మార్గ ఘాతకమ్ము
సంస్కృతీ వైభవాపేక్ష సగము బలము !! 99

తే.గీ. స్వంత లాభమ్ము కొంతైన వదలుకొనిన
స్వార్థ రాహిత్యమూనిన సగము బలము
పొరుగువానికి సాయమై తరలునెడల
పూర్తి బలమైన భారతి పొందు జయము !! 100

తే.గీ. భరతజాతి చరిత్రము నెరుగుమయ్య
బుద్ధిమంతులు యెందరో పుట్టి జాతి
గౌరవాదర సంపదన్ గాచినారు
సృష్టి మూలమ్ము ఛేదించి చెప్పినారు ! 101

తే.గీ. భారతీయుల శాస్త్ర ప్రభావ గరిమ
వ్యాప్తిజెందెను యావత్ప్రపంచమెల్ల
కాని ముష్కర మూకల కాండవలన
మరుగు పడిపోయె మనఖ్యాతి చరితమెల్ల !! 102

తే.గీ. వేయి యేండ్లకుముందు నీ పేరు జెప్ప
వంగి జేజేలు పలికె ప్రపంచమెల్ల
పండితావళి దరలించి పిండుకొనిరి
విద్య పాశ్చాత్య పండితుల్ ఖాద్యమట్లు !! 103

తే.గీ. మానసమ్మును రోదసీ యానమొనర
జేసి విజ్ఞాన సంగతుల్ సేకరించి
విపుల పంచాంగమిచ్చిన వేత్తలెవరు ?
ఋషులు దివ్యత్రికాలజ్ఞ వృద్ధులు గద ! 104

తే.గీ. భౌతికాంశమ్ములనుగూర్చి భారతీయ
ఋషుల యన్వేషణలు లోకవృత్తమునకు
తోడుపడినవి గాని విద్రోహులగుచు
అన్యదేశీయులకు కీర్తి నద్దినారు ! 105

తే.గీ. గణితవిజ్ఞానులెవ్వరు ?కవికులమున
కాద్యులెవ్వరు ?శూన్య సంఖ్యా విశిష్ట
శోధనాద్యు డెవండు? రాసుల్ గణించు
గ్రహణ సంభవకాల గణకులెవరు ? 106

తే.గీ. నీతినియమాల సృషించి నేర్పుమీర
మనిషి దేవునితోడ సమానుడట్లు
యోగవిద్యను నేర్పిన భోగి యెవరు ?
భారతీయుడు కాడా ప్రపంచమందు ? 107

తే.గీ. అష్ట సిద్ధుల సాధించి యఖిల జగతి
నేలినట్టి మహామును లెవరు వారు ?
కానివీటినిమరచిసంగ్రామకరణి
తన్నుకొనుచుండ ఘనతయేదారిదప్పె!! 108

తే.గీ. భరతదేశాభివృద్ధి సంపాదనమ్ము
ఎన్నికల పద్ధతిని యుండె నెవ్వరైన
వోటువేయనివారికి వైటుకార్డు
రద్దుచేయుచు రుసుమును రుద్దవలెను 109

తే.గీ. ఏ ప్రచారమ్ము చేయరాదెవ్వరైన
మీడియానుండి మాత్రమే వేడుకొనుచు
వోటు కోరగదగు నిది దాటువారి
యర్హతను రద్దు గావించి యణచవలెను 110

తే.గీ. ఎదటివారి గురించి ఏమనగరాదు
తనగురించి విశేషముల్ మనవి జేసి
వోటునిమ్మని కోరుట పాటియగును
ధనప్రసక్తిని యెందునన్ తలపరాదు 111

తే.గీ. నేరచరితులు పోటీకి నిలువరాదు
భూరి ధనవంతులైనను పోరరాదు
వీలు కానట్టి వాగ్దానములును తగవు
నిట్లు చెప్పినవారి శిక్షింపవలయు 112

తే.గీ. ఓటరును గనిపెట్టెడియుక్తి కొరకు
శుద్ధయంత్రాలు వాడి విశుద్ధగతిని
ఎన్నికలు నిర్వహించు సమీక్షచేయ
వలయు నస్త్రాలయ విధాన సులభగతిని !! 113

తే.గీ. పాలనను పక్షపాతానుశీలనమ్ము
దొరలకుండగకాపుండి ధూర్తజనుల
పీచమణచగవలయు నిర్వేదపడక
సర్వ జనహిత మనునదే సాగవలయు 114

తే.గీ. నన్ను గనినట్టి భూమిపై మిన్నయైన
ప్రేమయుండుట చేత నభీష్టములను
వెల్లడించితి బాధ్యత నెల్ల జనులు
దీని నాలోచనము చేసి తీర్పునిండు !! 115

తే.గీ. బుద్ధిమంతులు దేశాభివృద్ధి గనుచు
స్వార్థ రహితమ్మునైన విశ్వాసభరిత
మార్గదర్శనమొనరించి మంచికొరకు
పూనుకొనవలె నుత్తమపురుషులట్లు ! 116

తే.గీ. సుగుణవైఖరి యెందున్న దిగులులేక
స్వీకరించుట మేలౌను వెఱపులేక
కాన నస్త్రాలయా యెన్నికల విధాన
మందుమంచిని గమనింపుమంటి నిచట ! 117

తే.గీ. దేశ స్వాతంత్ర పోరాటదీక్షయందు
తలచు భావాలసిద్ధికై తరలకుండ
వక్రమార్గమ్ముపట్టుట సక్రమమ్మె?
ఇందుకా వారి పోరాట చందమంత ? 118

తే.గీ. పాలనమ్మది దోపిడీ పరుల నుండ
ప్రజలసంక్షేమమెటులుండు భ్రమలతోడ
కాలహరణమ్మెయౌగాని కలిసిరాదు
తిండిపోతులపుష్టి కైదండ యగును ! 119

తే.గీ. ఓటులమ్మెడి సంస్కృతిన్ తూటువరచి
దోపిడీదార్ల పాలన నాపివైచి
మేలుగాంచెడి విధముకై మేలుకొనుడు
ఇదియె యస్త్రాలయా కుసుమాది ఫలము !! 120

– స్వస్తి –